# ఫ్రాన్స్ vs వియాత్నం యుద్ధము

# FRENCH AND VIYATNAM WAR




రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

ఫ్రాన్స్ vs వియత్నామ్ యుద్ధము {01 } 27 -10 -24

బ్రూనై , కంబోడియా , ఇండోనేషియా , లాఓస్ , మలేషియా , మయాన్మార్ , ఫిలిప్పీన్స్ , సింగపూర్ , థాయిలాండ్ , వియత్నాం ,అనే దేశాలన్నింటినీ కలిపి సౌత్ ఈస్ట్ ఆసియా దేశాలు అంటారు <> ఇందులోని వియత్నాం , కంబోడియా , మరియూ లాఓస్ అనే దేశాలు మూడింటిని కలిపి "ఇండోచైనా " దేశాలు అంటారు <>. ఇండో చైనా దేశాలు అంటే ఏ దేశ ప్రజలపై చైనా మరియూ భారత్ యొక్క మత , సంప్రదాయ , ఆచార వ్యవహారాల ప్రభావము ఉంటుందో ఆ దేశాలను ఇండో చైనా దేశాలు అంటారు .
చైనా నుండి మత సంప్రదాయాలు - ఇండియా నుంచి హిందూ దేవీ దేవతలు ఇండో చైనా దేశాలలోకి ప్రవేశించారు . హిందూ దేవీ దేవతల తో పాటుగా అప్సర కూడా వీరి దేశాలలోకి ప్రేవేసించింది . ఈ మూడు దేశాలలో అప్సర యొక్క శిల్పం అనేక చోట్ల కనిపించగా - హిందూ ఇజం తరఫున ఈమె కూడా { దేవీ దేవతల తో పాటు సమంగా } ఈ ఇండో చైనా దేశాలను ప్రభావితం చేసిందని గుర్తించారు . హిందూ ఇజం ఇక్కడికి రాక ముందు, దేవలోకం లో అప్సర అనే సుందరి ఉండటం అనే వూహ వీరు ఎరుగరు . దానా దీనా మన అప్సరస వీరిపై ఎక్కువ ప్రభావం చూపింది. ఈమె కారణంగా ఇక్కడి సామాన్య జనం హిందూ మతాన్ని ఆమోదించారు. ఇండో చైనా దేశాలలో ఒకటైన వియత్నామ్ గురించి మనము తెలుసుకో బోతూ వున్నాము .ఎన్నో కారణాల వల్ల ఇక్కడి హిందూ ఇజం కను మెరుగైంది . నేడు 70000 మంది హిందువులు మాత్రమే వియత్నామ్ లో వుంటారు. వీరిని "Cham " చం" లు అంటారు .

ఫ్రాన్స్ఈ -- ఇండో చైనా దేశాలలోకి ప్రవేశించి అక్కడ తన వలస రాజ్య స్థాపన చేసింది . ఫ్రెంచ్ వారు మొదటిగా ఆక్రమించుకున్నది వియత్నామ్ ని -- ఆ తరువాత - , కంబోడియా మరియూ లాఓస్ ని .

ఆగష్టు 1858 లో, 14 ఓడలలో 2,500 మంది ఫ్రెంచ్ మనుషులతో - ఫ్రెంచ్ వారు యత్నామ్ లోని Tourane అనే పట్టణపు ఓడరేవులోకి ప్రేవేశించి-

సెప్టెంబర్  ఒకటి -1858  లో  ఆ పట్టణాన్ని తమ స్వాధీనంలోకి తీసుకున్నారు . October 17, 1887 న అధికారయుతంగా- వియత్నామ్ లో  తమ రాజ్యపాలనను  ప్రకటించారు. ఆలాగా వియత్నామ్ లో వీరి పాలన కిందకు వచ్చింది  . వీరి కంటే ఇంకా ముందు గా నే  ఫ్రాన్స్ కి చెందిన క్రీస్టియన్ మత ప్రచారకులు కూడా వియత్నామ్ కి  వచ్చారు .  వియత్నామ్ లో వారి ఉనికిగుర్తింప తగినంతగా   ఉండేది .
వియత్నామ్ దేశం లోకి  -19 వ శతాబ్దం మధ్యలో  ప్రేవేశించి న  - ఫ్రెంచ్ వారు. అప్పటినుండీ 20 July 1954 వరకూ ఆ దేశాన్ని ఏలారు . ఫ్రెంచ్ వారి పాలన కిందకు వచ్చాక ఇండో చైనా ప్రాంతాన్ని  ఫ్రెంచ్ ఇండో చైనా అని పిలిచారు . అంటే ఇవి ఫ్రెంచ్ వారి ఆక్రమణ లేదా అధికారంలో ని భూభాగమని  ప్రపంచ దేశాలు ఒప్పుకున్నట్లు . ఇంతకు ముందు రోజులలో ఫ్రాన్స్ - ఫ్రాంకో -పెర్షియన్   వార్ అనే యుద్ధములో జెర్మనీ చేతిలో ఓటమి పాలై వున్నది . తరిగి పోయిన తన రాజ్యాన్ని విసరించుకునే పనిలో భాగంగా ఫ్రాన్స్ ఇండో చైనా భూ భాగం పై ద్రుష్టి పెట్టింది . ఫ్రెంచ్ వారు ఈ ప్రాంతము ఆక్రమించటానికి  ముందే - అనగా 17  వ శతాబ్దంపు మొదటిలోనే  - ఫ్రాన్స్ కి చెందిన క్రిస్టియన్ మత ప్రచార కర్తలు ఈ ప్రాంతంలోకి వచ్చి చెర్చిలు స్థాపించారు .  వారు ఏర్పరిచిన సూది మొన వంటి రంధ్రం లోకి - ఫ్రాన్స్ వారు దబ్బనంలాగా దిగి  గుణపం లాగా స్థిరపడ్డారు అనొచ్చు.
"ఫ్రెంచ్" అనే మాట "ఫ్రాంక్ "అనే రోమన్ మాట నుండి వచ్చింది." ఫ్రాంక్ "అంటే అన్నీ ఉచితం గా రావాలని కోరుకునే వాడు అనే అర్ధం కూడా వుంది .

వియత్నాం మొత్తము ఒకే భూభాగము అయినప్పటికీ  - ఇది  - నార్తర్న్ వియత్నాం , లేదా టోంకిన్  ఏరియా అని , సెంట్రల్  వియత్నాం లేదా   అన్నం ఏరియా అని ,  సథరన్  వియత్నాం : లేదా కోచించిన ఏరియా అనే   -- మూడు ముక్కలుగా  ఎప్పటినుండో గుర్తింప  బడుతూ  వుంటున్నది .  మనము సౌత్ ఇండియా నార్త్ ఇండియా అని వ్యవహరించినట్లు అన్న మాట. 1858  లో వియత్నామ్ లో అడుగు పెట్టిన ఫ్రెంచ్ వారు 1883  నాటికి  , టొంకిం మరియు అన్నం  ఏరియాలలో  తమ వలస పాలన స్థాపించారు . 1887: 1893: లలో కంబోడియా ,  మరియూ లాఓస్ , లో కూడా తమ వలస పాలన స్థాపించారు .




**Vietnam: Women of the anti-French colonial resistance captured at Yen The, 1886**

ఫ్రాన్స్ vs వియత్నామ్ యుద్ధము {02} 28 -10 -24

ఫ్రాన్స్ వియాత్నం ను క్రమంగా ఎలా ఆక్రమించింది అనేది చూద్దాము .

వియాత్నం లోని "టోంకిం" ఏరియా లోకి చొరబడే చైనా సైనికులను అడ్డుకోవటం మరియూ "బ్లాక్ ఫ్లాగ్ ఆర్మీ" అనే సముద్రపు దొంగల ముఠాని ఎదుర్కోవటం లో అప్పటి రాజుకు సహాయ పడటం అనే కారణంతో ఫ్రాన్స్ తన సైనిక దళాన్ని "టోంకిం" లో కి ప్రవేశపెట్టింది . అప్పుడు " టోంకిం " ఏరియాని ఒక బలహీన మైన రాజ వంశస్థుడు పాలిస్తూ ఉండేవాడు . తన బలం పెంచుకోవటం కోసం ఆయన ఫ్రెంచ్ వారి సైన్యాన్ని తన రాజ్యం లోనికి అనుమతించాడు .

"అన్నం" అనే వియాత్నం లోని ఈ రెండో ప్రాంతాన్నిఫ్రెంచ్ వారు 1883 లో ఆక్రమించారు . ఇక్కడి రాజు మరణించాక తలయెత్తిన వారసత్వపు తగాదాలతో

తల దూర్చటం ద్వారా ఫ్రెంచ్ వారు ఇక్కడ తమ సైన్యాన్ని దింపారు . ఇంగ్లాండ్ వారు ఇండియాలోనూ ఇదే పద్ధతి అనుసరించారు .

ఇక వియాత్నం లోని మూడో భూభాగమైన "కోచించిన": ను ఫ్రెంచ్ వారు 1859 నుండీ ఆక్రమించటం మొదలు పెట్టి 1862 నాటికి దానిని పూర్తిగా స్వాధీన పరుచుకున్నారు . వరుస యుద్ధాలలో జయించటం ద్వారా ఫ్రెంచివారు ఈ భూభాగాన్ని తమ స్వాధీనంలోకి తెచ్చుకున్నారు . కోచించిన అనేది ఒక ఓడరేవు ప్రాంతము . కో అనే మాట తీసివేస్తే దీనిని "కొచ్చిన్ "అనే మాటలాగా వియాత్నం వారు పలుకుతారు . భారత దేశములో కొచ్చిన్ వున్నది కదా ? దానిని మరియూ వియాత్నం లో వున్న ఈ ప్రాంతాన్ని విడివిగా గుర్తించటానికి వీలుగా , ఫ్రెంచ్ వారే వియాత్నం వారి కొచ్చినా కు కో అనే మాట తగిలించి దీనిని కో-చించిన అనే పేరు న పిలిచారు . ఈ రేవు ద్వారా వెళ్లి "కంబోడియా " మరియూ "లాఒస్" ని తమ రాజ్యం లో భాగంగా చేసుకోవాలని భావించిన ఫ్రెంచ్ వారు ఈ ప్రాంతాన్ని జయించి తమ స్వాధీనం లోకి తీసుకోవటానికి మొగ్గు చూపారు . " కోచించిన " వియాత్నం దేశాన్ని కాపాడే సముద్ర ప్రాంతము లేదా సముద్ర శక్తి వంటిది .
{ఇదే విధంగా ది బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వారు కాకినాడ ను కో - కెనాడా అని తమ సౌకర్యార్థం పిలిచారు . వారు మొదటిగా "ది కెనడియన్ బాప్టిస్ట్ మిషన్ అనేది ఇక్కడ ఏర్పాటు చేసి , అలనాటి కాకినాడ ప్రాంతాన్ని కోకెనాడా గా ఉచ్చరించారు . భారత దేశము స్వాతంత్రము పొందినాక ఈ ప్రాంతము తిరిగి కాకినాడగా ఉచ్చరింపబడింది .

"కోచించిన" -కి సౌత్ చైనా సి , గల్ఫ్ అఫ్ థాయిలాండ్ మరియూ కంబోడియా లతో సరి హద్దులు ఉంటాయి . ఈ భూ భాగాన్ని చైనా వారినుండి కాపాడు తాము అని వియాత్నం లోని ఆ నాటి " కోచించిన రాజులకు భరోసా ఇచ్చి న -ఫ్రెంచ్ వారు తమ సైన్యాన్ని ఇక్కడ దింపి ఆఖరుకు ఈ ప్రాంతాన్ని జయించి స్వాధీన పరుచుకున్నారు . ఇట్లాగు న వియత్నాం మొత్తము ఫ్రెంచ్ వారి వశము ఐంది .

తమ దేశం నుండి ఫ్రెంచ్ వారిని వెళ్లగొట్టటానికి గానూ వియాత్నం ప్రజలు ఫ్రెంచ్ వారి పై చేసిన సాయుధ పోరాటాన్ని లేదా జరిపిన యుద్ధాన్ని ప్రపంచ దేశాల వారు -- ఫ్రెంచ్- ఇండో చైనా వార్ అనిపిలుస్తారు --ఇదే యుద్ధాన్ని ఫ్రాన్స్ వారు ఇండోచైనా వార్ అని పిలుస్తారు . ఇదే యుద్ధాన్ని వియాత్నం వారు ఫ్రెంచి వారి పై ప్రతిఘటనా పోరాటం అని పిలుచుకుంటారు ,

పై యుద్ధము ఫ్రాన్స్ కి , మరియూ వీట్ మింహ్ {Việt Minh } లేదా "ది డెమోక్రాటిక్ రిపబ్లిక్ అఫ్ వియత్నాం "అనబడే సంస్థకి మధ్య జరిగింది . ఈ యుద్ధాన్ని Việt Minh తరఫున Nguyên Giáp మరియూ Hồ Chí Minh.అనే వారు నిర్వహించారు . వీరిది సాయుధ గొరిల్లా పోరాటం . యుద్ధము 19 డిసెంబర్ 1946 నుండీ మొదలై 20 జులై 1954.వరకూ జరిగింది .యుద్ధములో ఎక్కువ భాగము టోంకిన్ అనే నార్త్ వియాత్నం ప్రాంతంలో జరిగింది .ఈ తిరుగు బాటు లాఓస్ మరియూ కంబోడియా దేశాలకు కూడా పాకింది. దీనిని ఆ దేశాల గురించి వివరించినపుడు రాస్తాను

ఫ్రాన్స్ vs వియత్నాం యుద్ధము {03} 29 -10 -24

ఫ్రెంచ్ వారు మొత్తము వియత్నాం ను ఆక్రమించిన విధానాన్ని చదివాము . దీనికి నిరసనగా వియత్నాం ప్రజలు ఫ్రెంచ్ వారి మీద సాయుధ పోరాటానికి దిగారు .

.అసలు మొదటగా వియత్నాం ప్రజలు ఫ్రెంచ్ వారి మీద తిరుగు బాటు చేయటానికి ప్రోత్స హించిన కారణాలు ఏమిటో ? అనేది చూద్దాము .

ఫ్రెంచ్ వారి వాళ్ళ - వియాత్నం లో రాజ్య అధికారాన్ని కోల్పోయిన రాజ వంశం వారి ని తిరిగి అధికారం లోకి తెచ్చేందుకు గానూ 1885 - 1889 మధ్య- వియాత్నం ప్రజలచే ఫ్రెంచ్ వారి మీద ఓ తిరుగు బాటు జరిగింది . వియాత్నం ను ఏలిన రాజవంశం వారు Nguyễn "నుగుయెన్ " వంశం వారు . వీరు 1558 నుండి 1777 వరకూ మరియూ 1780 నుండి 1885, వరకూ రాజులుగా వున్నారు . ఈ రాజ వంశస్థులు తమ దేశము లో వుండే చైనా వారిని వేళ్ళ

కొడుతూ , చైనా దేశము వచ్చి వియత్నామ్ ను ఆక్రమించకుండా చేస్తూ , ప్రజల మన్నన పొందుతూ వుండే వారు . ఇదే తరహాలో ఫ్రెంచ్ వారు కూడా వియాత్నం లో వుండే చైనా వారి నందరిని వెళ్ళ కొట్ట సాగారు . ఈ నేపథ్యంలో చైనాకి ఫ్రెంచ్ వారికీ 1885 లో Bang Bo.బాంగ్ బో అనే పేరుగల యుద్ధము జరిగింది . దీనిని Battle of Zhennan అని కూడా అంటారు . ఇందులో చైనా వారు గెలిచారు.ఈ యుద్ధము కూడా టోంకిన్ ప్రాంతములోనే జరిగింది .టోంకిన్ ప్రాంతములో యుద్ధము చేయటం అంటే మామూలు యుద్ధం లాంటిది కాదని ఫ్రాన్స్ గ్రహించలేకపోయింది. దానితో చైనా చేతిలో ఫ్రెంచ్ వారి ఓటమి పాలైంది - ఈ ఓటమి ఫ్రాన్స్ దేశపు రాజకీయాలను కుదిపి వేసింది . ఫ్రాన్స్ లో నెలకొన్న గందరగోళాన్ని దృష్టిలో పెట్టుకొని 1885 - 1889 మధ్య వియాత్నం ప్రజలు ఫ్రెంచ్ వారి మీద తిరుగు బాటు చేసి తమ రాజును తిరిగి అధికారంలోకి తెచ్చుకునే ప్రయత్నం చేశారు . ఈ యుద్ధము కోసము అని- తిరుగుబాటును అణిచివేయటానికి అని , ఫ్రెంచ్ వారు తెచ్చుకున్న సైన్యము లోని 42000 మంది సైనికులు వియాత్నం లోనే దిగబడి పోయారు . ఈ సైన్యపు ఉనికి వియాత్నం వారికి ఫ్రాన్స్ అంటే మరింత వ్యతిరేకత కలిగేట్లు చేసింది . ఫ్రాన్స్ అంటే, తమ శత్రు దేశమన్న భావన చైనా ప్రజలలో కలిగింది .
ఫ్రెంచ్ వారు తాము వియాత్నం లో ప్రవేశించటాని కి గల కారణం -రాజ్య కాంక్ష కాదని - క్రిస్టియానిటీ ని భోదించే మత భోదకులకి రక్షణ కల్పించటమే అని ప్రపంచ దేశాలకు చెప్పుకున్నారు . క్రిస్టియానిటీ వర్ధిల్లుతుంది కదా ? అనే ఆశతో అమెరికా వంటి దేశాలు- ఫ్రెంచ్ వారి పాలనా పట్ల మౌనం పాటించాయి . 17 వ శతాబ్దము నుండీ క్రిస్టియన్ మత బోధకులు వియాత్నం లో వున్నారు అని ఇంతకు మునుపే చెప్పుకున్నాము . ముందుగా కొందరు మతభోదకులు రావటం ఏమిటి "?, వారికి రక్షణగా ఓ దేశపు సైన్యము రావటం ఏమిటి ? ఇది మన దేశం లోని మన సొంత మతాన్ని రూపు మాపటానికి కాదా ? అన్న ప్రశ్నలు ప్రజలలో తల ఎత్తాయి . ఇలా అలోచించిన వారు తమ స్వీయ మత రక్షణ కోసం ఫ్రెంచ్ వారి మీద తిరుగ పడ్డారు. క్రిస్టియన్ లు అడుగు పెట్టటానికి ముందు వియాత్నం లో బుద్ధిజం , Confucianism , టావోయిజం , మరియూ కొన్ని స్థానిక మతాలూ ఉండేవి . బుద్ధిజం , చైనా మరియూ ఇండియా నుండి వియాత్నం లోకి క్రీస్తు శకం రొండో శతాబ్దములో ప్రవేశించింది. అప్పటినుండీ

వియాత్నంలోని ఎక్కువమంది ప్రజలు మహాయాన బుద్ధిజం ను అనుసరించే వారు .

వియాత్నం రాజ వంశస్థులు ఐన లీ వంశము వారు, చైనా లో జన్మించిన Confucianism - కాంఫుసనిజం ని 1070,నుండీ తమ దేశపు అధికార మతము గా చేసుకున్నారు . అప్పటినుండి ఫ్రెంచ్ వారి అండతో క్రిస్టియానిటీ భోదించ బడే వరకూ కూడా ప్రజలు- బౌద్ధ మతము కన్నా ఎక్కువగా Confucianism మతమునే అనుసరించే వారు . Confucianism. --మానవులు ఒకరినొకరు ప్రేమించుకోవాలని-- .విషయ పరి జ్ఞానము పొందటానికి ఎక్కువ ప్రాధాన్యము ఇవ్వాలని-- ఏ వ్యక్తి అయినా తన కుటుంబము పట్ల మొదటి భాద్యత వహించాలని,--- ప్రతి ఒక్కరూ శాంతీ- సౌఖ్యం న్యాయం వంటివి నెలకొల్పే భాద్యత తీసుకోవాలని భోదిస్తుంది .ఈ బోధనలు వియాత్నం ప్రజల తిరుగు బాటులో ముఖ్య పాత్ర పోషించాయి .
Lao-tzu, అనే చైనా అయన రాసిన గ్రంధాల ప్రకారం "టావోయిజం" వచ్చింది . ఇది వ్యక్తుల మధ్య ప్రేమను - మతాచార్లను నిష్ఠతో ఆచరించటం గురించి చెబుతుంది.మొత్తము మీద వియాత్నం ప్రజలలో అత్యధికులు బుద్దిస్టులు- మరియూ సాంప్రదాయక వాదులు గా ఉండేవారు .
" ది ఫ్రెంచ్ ఈస్ట్ ఇండియా కంపెనీ " అనేది మొదటి సారిగా 1668 లో వియాత్నం లో అడుగు పెట్టి క్రిస్టియానిటీ ప్రచారానికి పూనుకుంది .ఆ రోజులలో వీరు కేవలం మత ప్రచారానికే పరిమితం కాకుండా వియాత్నం ప్రజలకు కొన్ని తాయిలాలు ఆశ చూపి - మత మార్పిడులు చేశారు . వియాత్నం రైతుల మధ్య పొలం తగాదాలు వచ్చినపుడు తమ తీర్పే చివరి తీర్పుగా క్రిస్టియాన్ ఫాధరీలు అమలు జరుపుతూ వుండే వారు . వియాత్నం లోని తెగలు తమలో తాము తన్ను కుంటూ ఉంటే ఫ్రెంచ్ క్రిస్టియన్ ఫాధరీలు -- ఎవరో ఒకరి పక్షము నిలబడి ఎదుటివారిని ఓడిస్తూ వుండే వారు . ఈ రకంగా క్రిస్టియానిటీ పట్ల వియత్నాం లో వ్యతిరేకత పెరిగింది .ఇది కూడా ఫ్రెంచ్ వారి మీద తిరుగు బాటుకు ఒక కారణమైంది .






BANG BO WAR CHINA SIDE

ఫ్రాన్స్ vs వియత్నాం యుద్ధము {04} 01 -11 --24

ఫ్రెంచ్ వారి పట్ల వియాత్నం లో తిరుగు బాటు రావటానికి గల కొన్ని కారణాలను ఇప్పటికే తెలుసుకున్నాము . మరి కొన్ని ఏమిటంటే ?
అప్పటి వరకూ వియాత్నం లోని జైళ్లు రాజుల పాలనలో ఉండేవి . వాటిని కాదని ఫ్రెంచ్ వారు అతి హీనమైన -నీచమైన జైళ్లను రూపొందించి . వాటిలో వియాత్నం ప్రజలను కుక్కే వారు . .ఈ జైలు వ్యవస్థ ఎలావుండేదంటే - చిన్న జేబు దొంగతనం చేసి జైలుకెళ్లి బయటికి వచ్చిన వాడు కూడా దీర్ఘకాలపు వ్యాధితో మరణానికి చేరువ ఐన స్థితిలో బయటికి వచ్చేవాడు . మానవత్వం మరిచిన ఫ్రెంచ్ జైలు వ్యవస్థ వల్ల కూడా ప్రజలు అసంతృప్తికి లోను అయి తిరుగు బాటు ప్రదర్శించారు

అంకేక రకాలుగా పెల్లుబుకుతూ వున్న ప్రజల అసంతృప్తిని ఆసరా చేసుకొని - మొదటగా స్థానిక వియాత్నం అధికారులు ప్రజల పక్షం నిలిచారు . అప్పుడు ప్రజలు ఫ్రెంచ్ వారిని మరింతగా ఎదిరించారు . దీనినుండి గెరిల్లా పోరాటం అనే వ్యవస్థ రూపొందింది . ఈ గొరిల్లా తమ దేశపు సరిహద్దుల వద్ద గల ఫ్రెంచ్ వారి సైన్యాన్ని ఎదిరించే పని చేపట్టారు .ఫ్రెంచ్ వారి మిలిటరీ స్థావరాలపై దాడులు చేశారు . మనము ఇంతకు మునుపు చెప్పుకున్న వియాత్నం లోని మూడు భూభాగాలలోని ఒక ప్రాంతము ఐన అన్నం అనే ప్రాంతం లో 1885 లో గొరిల్లా దళం పుట్టింది - దీనిని Phan Dinh Phung =ఫన్ డినః ఫూన్గ్ ముందుకు నడిపాడు .
వియాత్నం గెరిల్లాలు తిరుగు బాటు చేస్తూ ఉంటే ఫ్రెంచ్ వారు ఏమి చేశారు అనేది తెలుసు కుందాము . దీనిద్వారా గొరిల్లా ల మధ్య ఫ్రెంచ్ అధికారం మధ్యా ఉన్న వాతావరణం ఎలా వేడిక్కిందీ తెలుస్తుంది .

వియాత్నం - గొరిల్లా దళాలు తమ మీదకు దాడి చేయటానికి ఆశ పడేటట్లు లేదా వీలయేట్లు ఫ్రెంచ్ఏ వారు కావాలనే కొన్ని ఏర్పాట్లు కల్పించి గొరిల్లాలలను రెచ్చ కొడుతూ ఉండేవారు . దీనివల్ల మూకుమ్మడి ప్రాణ నష్టం ఎక్కువ గా ఉండేది . గెరిల్లా మీద డాడి చేయటానికి ప్యారాచూట్ల ద్వారా ఫ్రెంచ్ సైనికులను గొరిల్లా స్థావరాల మీదకు దింపే వారు .ఫ్రెంచ్ వారు నపాల్మ్ బాంబులు అనే బాంబులను వాడి- వియాత్నం ప్రజలు వారి పశువులు పంటలు చెట్లు పొలాలు వంటి వి మంటలలో కాలి పోయేట్లు చేశారు .ఇది మానవ హక్కులకు వ్యతిరేకం.

వియాత్నం లోని సహజ సంపదను ఫ్రెంచ్ వారు తమ దేశానికి చేరవేసుకున్నారు.
వియాత్నం లో పాశ్చాత్య ఆలోచన ధోరణితో సాగే ప్రభుత్వాన్ని ప్రవేశ పెట్టారు .



వియాత్నం వారి వ్యవసాయ రంగములో కి తల దూర్చి భూస్వాములను ప్రోత్సహించి సాధారణ రైతులను అణగ తొక్కారు . రబ్బరు - బియ్యము వంటి వాటిని దేశము నుండి యథేచ్ఛగా తరలించుకు పోయారు .ఇలా వియాత్నం ప్రజలకు కరువు మిగిల్చారు

--అదనపు సమాచారం --

ఈస్ట్ ఇండియా కంపెనీలు అనే పేరున మూడు కంపెనీలు వున్నాయి .
ఒకటి - ది ఫ్రెంచ్ ఈస్ట్ ఇండియా కంపెనీ - ఇది 1664 లో పుట్టింది . వర్తక వాణిజ్యాలలో బ్రిటిష్ మరియూ డచ్ వారితో పోటీ పడటానికి ఈ కంపెనీ పుట్టింది . ఇది Jean-Baptiste Colbert, అనే ఫ్రెంచ్ ఆర్థిక మంత్రి సృష్టి .

రెండొది ఐన " ది పోర్చుగీస్ ఈస్ట్ ఇండియా కంపెనీ" అనేది 1628 లో పోర్చుగల్ లో పుట్టింది - ఇండియా మరియూ ఆసియ దేశాలతో వర్తక వాణిజ్యాలు చేయటానికి పుట్టింది. 1633 లో అంటే అతి స్వల్ప కాలంలో ఈ కంపెనీ మనుగడ కోల్పోయింది .
పై రెండూ కాక కేవలం " ఈస్ట్ ఇండియా కంపెనీ" అని మాత్రమే పిలవబడే -కంపెనీ వున్నది . దీని పూర్తి పేరు " ది బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ"

డిసెంబర్  31  , 1600  లో  ఇండియా మరియూ ఆసియ దేశాలతో వర్తకం కోసం ఈ కంపెనీ స్థాపించ బడింది. ఈ కంపెనీ ఇతర దేశాలతో స్వతంత్రంగా వ్యహరించటానికి స్వంత హక్కులు కలిగి ఉండేది .  భారత్ మరియూ ఆసియా దేశాలలో దొరికే సుగంధ ద్రవ్యాల మార్కెట్ ను కంట్రోల్ లోకి తీసుకోవటం కోసం బ్రిటిష్ వారు ఈస్ట్ ఇండియా కంపెనీకి ప్రత్యేక హక్కులు కల్పించారు . ఈ హక్కుల మూలకంగా ఈస్ట్ ఇండియా కంపెనీ భారత దేశములో కుటిల రాజకీయాలు నడపగలిగింది .




French soldier threatening a farmer of viatnam - which ia crime

ఫ్రెంచ్  vs  వియాత్నం యుద్ధము  [5]    03 -011 --24

వరల్డ్ వార్ రొండు లో ఓ భాగంగా - జపాన్    సెప్టెంబర్  22  , 1940  ,న వియత్నాం మీద దాడి చేసింది. అప్పటినుండీ 1945  లో  జపాను అల్లైడ్ ఫోర్సెస్ కి లొంగి పోయే వరకూ  వియాత్నం జపాన్ వారి పాలన కింద వున్నది .

జపాను  వియత్నాం మీదకు ఎందుకు దాడి ఛిసిందో కూడా తెలుకుకొందాము




.

Japan soldiers entering into vietnam

రెండో ప్రపంచ యుద్ధము కాలము నాటికి జపాను అమెరికాలు శత్రు దేశాలు . చైనా అమెరికా కి మిత్ర దేశం కింద పరిగణింప బడుతూ ఉండేది . జపానుకు-- చైనాకు మధ్య "ది సెకండ్ చైనా -జాపనీస్ వార్" అనేది జరుగుతూ వున్నది. జపాన్ ని ఓడించటం కోసమని - అమెరికా - వియాత్నం లోని ఫ్రెంచ్ వారి ద్వారా - తన ఆయుధాలను చైనా వారికి అందచేస్తూ ఉండేది . ఈ ఆయుధ సరఫరాను ఆపాలి అని , జపాను -వియాత్నం లో వున్న ఫ్రెంచ్ వారి మీద యుద్ధానికి దిగింది .ఇదేకాక ఇండోచైనా దేశాలలో ఆయిల్ . బొగ్గు , రబ్బర్ , బియ్యము వంటివి పుష్కలంగా దొరుకుతాయి .వీటిని ఫ్రాన్స్ యథేచ్ఛగా వాడుకుంటూ వున్నది . వీటిని తన యుద్ధ అవసరాలకు వాడుకొని రెండో ప్రపంచ యుద్ధములో గెలవాలని ఆలోచించి కూడా జపాన్ వియాత్నం మీద దాడికి దిగింది. అన్ని దేశాలూ ప్రపంచ యుద్ధము మీద దృష్టి పెట్టి ఉన్న సమయం లో వియాత్నం మీద దాడి చేసి అక్కడినుండి ఫ్రెంచ్ వారిని వెళ్ళ కొట్టి - వియాత్నం లోని వ్యాపార మార్కెట్లోకి తాను ప్రవేశించేఉద్దేశ్యంతో కూడా జపాను కు వుంది .



Japanese army in vietnam on bi- cycle rally

పై లక్ష్యాలతో-- జపాన్-- "ఫ్రెంచ్ ఇండో చైనా దేశాలపై" - యుద్ధము చేసి వియాత్నం కాబోడియా లాఓస్ లో తనకు అనుకూల మైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకుంది . ఇట్లగా వియాత్నం జపాన్ వారి పాలనలోకి వచ్చింది . జపాన్ సెప్టెంబర్ 22 , 1940 ,న వియత్నాం మీద దాడి చేసింది.అప్పటినుండీ 1945 లో జపాను అమెరికా వారి "అల్లైడ్ ఫోర్సెస్" కి లొంగి పోయే వరకూ కూడా వియాత్నం జపాన్ వారి పాలన కింద వున్నది .

ఫ్రెంచ్ వారు జపాను ను ఏమీ చేయలేక పోయారు . వియాత్నం లోని ఫ్రెంచ్ సైన్యము కన్నా జపాన్ సైన్యము అధికముగా ఉండేది . ఇదే కాక వియాత్నం లోని ఫ్రెంచ్ సైన్యానికి ఫ్రాన్స్ నుండి - అదనపు సైనిక బలము - ఆయుధాలు రావటము ఆగి పోయింది . కారణము - ఫ్రాన్స్ లో నెలకొన్న రాజకీయ పరిస్థితులు . ఈ నేపథ్యంలో వియాత్నం లోని ఫ్రెంచ్ అధికారులు జపాను వారితో కుమ్మక్కు అయి - తమకు సహకరించని వియాత్నం ప్రజలను లొంగతీయటంలో జపానుకు తమ వంతు సహకారాన్ని అందించారు .. ఇలా సహక రించటం ద్వారా జపానుతో

తనకు గల వ్యాపార ప్రయోజనాలు దెబ్బతినకుండా వుంటాయని ఫ్రాన్స్ భావించింది . రెండు బలగాల వల్లా ప్రజలు మరిన్ని ఇబ్బందులు పడ్డారు .

ఏది ఏమైనా మార్చ్ 1945.లో జపాను వారు తమ కు ఫ్రాన్స్ కి కల వ్యాపార ఒప్పందాలను రద్దు చేసుకొని , అదే 1945, లో- వియాత్నం లోని ఫ్రెంచ్ వారి రాజ్యాన్ని పూర్తిగా కూల దోసి - మొత్తం అధికారాన్ని - ఆ దేశాన్ని తమ చేతుల్లోకి తీసుకున్నారు .

రెండో ప్రపంచ యుద్ధములో భాగంగా - August 15, 1945: న తాను లొంగి పోవటానికి సిద్ధంగా వున్నానని జపాను అమెరికా మరియూ దాని మిత్రదేశాలకు తెలిపింది . ఆ తరువాత సెప్టెంబర్ 02 - 1945 జపాన్ వారు- అమెరికాకు లొంగి పోయి వియాత్నం ను వదిలి పెట్టి వెళ్లి పోయారు . పోయేముందు వీరు వియాత్నం రాజు " బావో డై " ని పిలిచి 'మీ దేశానికి స్వతంత్రం వచ్చినట్లు' ప్రకటించుకోమని కోరారు . రాజు గారు అప్పటికే నామమాత్రపు వాడుగా వున్నాడు . తాను స్వాతంత్రం ప్రకటిస్తే ఇహ ఫ్రెంచ్ వారిని నిలువరించడం తన భాద్యతే అవుతుంది అనే భయం తో , ఈ రాజుగారు తన దేశం తరఫున ఏ స్వంతంత్ర ప్రకటనా చేయకుండా - ఊరుకున్నాడు . పైగా Ho Chi Minh కి మరియూ డెమోక్రాటిక్ రిపబ్లిక్ ఆఫ్ యత్నాం కి తన మద్దతు తెలుపుతూ తన రాచరికాన్ని వదులుకున్నాడు { ఆంటే భాద్యతలను వదుల్చుకున్నాడు } .

ఇదే జపాను వారు "Ho Chi Minh." నే పిలిచి " నీవు స్వాతంత్రము ప్రకటించుకో " అని అడిగి ఉండవచ్చును గదా ? అనే ప్రశ్న మనలో తలెత్తుతుంది . Ho Chi Minh కమ్యూనిస్ట్ కావటం వల్ల అతనితో ఏదన్న సంభందాలు పెట్టుకుంటే అది అమెరికాను మరింత రేచ్చగ్గొట్టినట్లు అవుతుందని జపాను భపడింది. అమెరికా ఇప్పటికే జపాన్ మీద అణుబాంబులు వేసింది .అందువల్ల తాను ఏమిచేసినా అది అమెరికాని మరింత రెచ్చ కొట్టటానికి చేసిన పనిగా

మారుతుందని జపాను డడిచింది .  ఈ రకంగా- అంటే తాను స్వతంత్రం ఇస్తే పుచ్చుకునే వారు లేక --జపాన్   వియాత్నం మీద తన అధికారాన్ని  ను వదిలి వెళ్లి పోయింది.




Left sede . kng Bao Dai, we failed to declare independence to vietnam

. ఫ్రాన్స్  vs వియాత్నం యుద్ధము [06 ]   05 -11 -24 .

ఫ్రెంచ్ వారి ఆక్రమణ తరువాత వియాత్నం లోని ముఖ్య పరిణామాలు ఇలా వున్నాయి .--   సెప్టెంబర్  22, 1940  న జపాను వియాత్నం పై దాడి చేసి వియాత్నం ను ఆక్రమించుకుంది

నార్తర్న్  వియత్నాం లో   May 19, 1941  లో Ho Chi Minh మరియూ ఇతర కమ్యూనిస్ట్  లీడర్స్   వీట్ మింహ్  అనే సంస్తను ఏర్పాటు చేశారు . ఈ సంస్థలో సాయుధులైన వ్యక్తులు ఒక భాగము . వీరికీ జపాన్ కి మధ్య పోరాటాలు నడిచాయి .

సెప్టెంబర్ 02 - 1945  జపాన్ వారు- అమెరికాకు లొంగి  పోయి  వియాత్నం ను వదిలి పెట్టి పోయారు.

అదే రోజు అనగా సెప్టెంబర్  2, 1945 న వియాత్నం  స్వాతంత్ర్యాన్ని పొందినట్లు- తమ దేశము ఫ్రెంచ్ వారి క్రింద లేదని -  వియత్నాం అనగా ఒక  స్వతంత్ర దేశమని Ho Chi Minh -  ప్రకటించాడు .

  తమ దేశాన్ని పాలిస్తున్న  ఫెంచ్ వారిని జయించిన జపాన్ వారు అమెరికా చేతిలో ఓటమి పాలు అయి - వెనక్కి వెళ్లి పోతూ ఉండటం తో  ,Ho Chi Minh   సెప్టెంబర్ 2, 1945 న వియాత్నం  స్వాతంత్ర్యాన్ని పొందినట్లు  ప్రకటించాడు . Ho Chi Minh's  యొక్క స్వతంత్ర ప్రకటన అమెరికా యొక్క స్వతంత్ర ప్రకటన ను పోలి వుంది . మనుసు లందరికీ సామాన అవకాశాలు వున్నాయి . సృష్టి కర్త అందరికీ సమాన హక్కులు  ,స్వేచ్చా జీవనము, సంతోషము ఇచ్చాడు అని ఆ ప్రకటన సారంశాము

 మొత్తం మీదా  "వియాత్నం ను వీడి పోతున్న జపాన్ వారు  వియత్నాం కి ఎటు వంటి స్వాతంత్రము ప్రకటించ లేదు . ఫ్రాన్స్ వారు - జపాన్  వారి చేతిలో ఓటమి పాలు అయి కూడా వియాత్నం కి ఎటువంటి స్వాతంత్రము ప్రకటించలేదు  . ఇటు ఫ్రాన్స్ కానీ అటు జపాను కానీ స్వాతంత్రము ఇవ్వని  వియత్నాం లో  Ho Chi Minh' స్వయంగా  స్వాతంత్రము ప్రకటించుకోవడం - అనేది  ఫ్రెంచ్ వారి దృష్టిలో - ఓ  తిరుగు బాటు కింద చూడ బడింది.  ఈ తిరుగుబాటును అణిచి వేసి - వియాత్నం ను తిరిగి తమ  పాలన కిందకు తెచ్చుకోవటానికి  ఫ్రెంచ్ వారు బ్రిటిష్ వారి సాయము అర్ధించారు .

డిసెంబర్  1946: లో వియత్నాం దేశము ను తన అధీనం లోకి తెచ్చు కోవటానికి ఫ్రాన్స్ ప్రయత్నించింది . ఈ సందర్భం లో - ఇప్పుడు మనము చెప్పు కుంటూ ఉన్న" ది  ఫస్ట్  ఫ్రాన్స్ఇం డోచైనా  వార్" అనేది మొదల యింది

తాము కోల్పోయిన వియాత్నం ను తిరిగి తన స్వాధీనము లోకి తెచ్చుకోవటానికి గానూ ఫ్రెంచ్ వారు బ్రిటీష్ వారిని సాయం అడిగారు . ఎందుకు అడిగారు అంటే ?రేండో ప్రపంచ యుద్ధము ముగిసే నాటికి  బ్రిటన్ దేశము   సధరన్  పార్ట్  అఫ్ వియత్నాం ,  కంబోడియా  మరియూ  లాఓస్ లోని కొంత  భూ భాగము  మీద

అజమాయిషీ హక్కులు పండింది . వియాత్నం లో మిగిలివున్న జపాను సేనలను తిరిగి జపాను లోకి పోయేటట్లు చూడటం కోసం బ్రిటనుకు ఈ ప్రాంతము మీద అజమాయిషీ చేసే భాద్యతలు అప్పగించారు .

ఇహ- నార్తర్న్ పార్ట్ అఫ్ వియత్నాంను- అజమాయిషీ చేసే పనిని చైనాకి అప్పగించారు .. చైనాకు ఎందుకు అప్పగించారు ? అనంటే -- వరల్డ్ వార్ - టూ లో చైనా -- యునైటెడ్ కింగ్డమ్ , యునైటెడ్ స్టేట్స్ అఫ్ అమెరికా , మరియూ రష్యాల కు మిత్రపక్షం గా ఉండేది .ఇది కాక వియాత్నం లోని ఈ భూభాగము అనేక మార్లు చైనా రాజుల పాలన కింద ఉంటూ పోతూ ఉంది . ఈ భూభాగము తమది అనిపించుకోవాలని చైనా ఇక్కడి ప్రజలకు చైనా ఆచార వ్యవహారాలను నయానో భయానో నేర్పుతూ వస్తూ వున్నది . అందువల్ల ఈ భూ భాగము చైనా కి ఇచ్చి వేశారు . ఈ రకంగా ప్రత్యేకించి ఎవరూ చెప్పకుండానే వియాత్నం దేశము రొండు భాగాలుగా విడదీయబడి కొంత చైనా మరికొంత బ్రిటీష్ వారి వారి పెత్తనం కిందకు పోయింది .

ఫ్రాన్స్ వియాత్నం యుద్ధము [7] 06 -11 -24

వియాత్నం లొవున్న ముఖ్య భూ భాగాలు మూడు అని అందులో "కోచించిన " ఒకటని దాని మీద కూడా ఫ్రెంచ్ వారి పాలన ఉండేదని మనము ఇంతకు మునుపు తెలుసుకున్నాము . వియాత్నం లోని దక్షిణ భూభాగం లో శాంతిని నెలకొల్పే పెద్దన్న పని బ్రిటీష్ వారికి దక్కినపుడు ఈ "కోచించిన" బ్రిటిష్ వారి అజమాయిషీ కిందకు పోయింది . అందు వల్ల ఫ్రాన్స్ వారు " వియాత్నంని "కోచించిన"నుండి తిరిగి ఎలే అవకాశం తమకు తిరిగి కల్పించమని బ్రిటీష్ వారిని అడిగారు . మేము కోల్పోయిన రాజ్యము మాకు ఇప్పించండి అని కోరటం తప్ప ఫ్రెంచ్ వారు వేరే కారణం ఏదీ చూప లేదు .

ఫ్రెంచ్ వారు తిరిగి వియాత్నం లో పాలన చేయటం మీద బ్రిటిష్ వారికి ఎటువంటి ఆసక్తీ లేదు . వారికి సాయంగా బ్రిటిష్ సేనలను వియాత్నం పంపటానికి కూడా బ్రిటన్ వెనుకంజ వేసింది . కానీ వియాత్నం పట్ల అమెరికా కు ఉన్న ఆలోచనల

దృష్ట్యా - బ్రిటన్ కీ అమెరికాకీ వున్న స్నేహాన్ని పునస్క రించుకొని బ్రిటిష్ వారు ఫ్రెంచ్ వారికి సాయం చేశారు అంతే . ఈ రకంగా ఫ్రెంచ్ -బ్రిటిష్ సంయుక్త దళాలు సెప్టెంబర్ 13, 1945 న సైగాన్ అనే వియాత్నాం పట్టణం లోకి ప్రవేశించాయి . సైగాన్ పట్టణము కోచించిన ప్రాంతానికి ముఖ్య పట్టణము , మరియూ సౌత్ వియత్నాం లోని అతి పెద్ద పట్టణము . ఈ రకంగా బ్రిటిష్ వారి మద్దత్తు తో ఫ్రాన్స్ వారు వియాత్నాం పై మరొక సారి పాలనకు పూను కున్నారు.---- అదనపు విషయము ----

నేతాజీ సుభాష్ చంద్ర బోస్ గారు సింగపూర్ నుండి 16 లేదా 17 of ఆగష్టు 1945 ,న పైన చెప్పుకున్న "సైగాన్" పట్టణానినికి వచ్చి - ఇక్కడి నుండి తైపే పట్టణానికి వెళ్లి, తైపేలో అయన ప్రయాణిస్తూ వున్న విమానము ప్రమాదానానికి గురి కాగా ఆగష్టు 18, 1945 న మరణించారు . సెప్టెంబర్ 2, 1945 న జపాను అమెరికాకి లొంగి పోయే వరకూ ఈ సైగాన్ జపాన్ వారి అదుపులో వుంది . అందువల్ల నేతాజీ సైగాన్ మీదుగా తైవాన్ లోని తైపే కి ప్రయాణించాబు . ఇహ తైవాను కూడా 1895 నుండీ జపాన్ వారి పాలనలో నే ఉండి - రెండో ప్రపంచ యుద్ధము లొవారు ఒడి పోయినాక చైనా వారికి హస్తగతమైంది .-------- మరొక అదనపు విషయము -----

నాకు తోచినది ఏమిటంటే - జపాన్ ఫ్రాన్స్ పాలన కింద వున్న వియాత్నాం లాఓస్ ని కంబోడియాని తన సొంతం చేసుకుంది . దీనికి అమెరికా- బ్రిటన్లు ఏమీ చేయలేక పోయాయి ఆంటే జపాన్ ను నిలువరించ లేక పోయాయి . ఇక తైవాన్ కూడా జపాను వారి రి చేతుల్లోనే వున్నది . దీనికి చైనా ఏమీ చేయలేక పోయింది . Karafuto అనే రష్యన్ ప్రాంతము కూడా జపాన్ కింద ఉండేది . దీనికి రష్యా కూడా ఏమీ చేయలేక పోయింది .ఇందువల్ల జపాన్ మీద పడిన అణు బాంబును చైనా రష్యాలు ఖండించ లేదు . ఇవికాక కొరియా మరియూ మంచూరియ దేశాలు కూడా జపాన్ పాలనలోనే వున్నాయి . ఇట్లా అనేక దేశాలు అనేక ఓడ రేవులతో జపాన్ దేశం అమెరికాతో సమ బలము కల దేశము గా ఉండేది . ఈ బలం తో - రెండో ప్రపంచ యుద్ధము లో భాగంగా జపాను బ్రిటిష్ వారిని ఓడించగలదని -

జపాను  భారత్ ని తన స్వాధీనం  లోకి తీసుకొని ఆపై భారత్ కి   స్వతంత్రం ఇవ్వగలదని - తాను చేయవలసిందల్లా -- తాను ఏర్పరిచిన ఆజాద్ హిందూ పవుజ్ ద్వారా జపాన్ కి సాయంగా నిలవటమేనని నేతాజీ భావించి వుంటారు . జపాన్ కనుక భారత్ ని ఆక్రమిస్తే - జపాను ఇంకా ఇంకా  పెద్ద సెక్తి గా మారు తుంది - అప్పుడు దాన్ని నిలువరించడం తమకు సాధ్యం అని భయ పడిన బ్రిటీష్ వారు - కేవలం జపాన్ వారిని  నిలు వరించటానికి అని -  భారత దేశపు కాంగ్రెస్ వారితో " మీరు మాకు మద్దత్తు ఇస్తే మేము మీకు స్వాతంత్రము ఇస్తాము " అనే ప్రతి పాదన చేశారు . ఈ రకంగా  నేతాజీ బ్రిటన్ వారి మెడలు వంచిన మొదటి వ్యక్తి వంటి వాడు . బ్రిటీష్ వారు భారత్ఇ కి స్వతంత్రం ఇవ్వకుండా కాలం గడపలేని పరిస్థితులు    కల్పించాడు . ఇట్లాగా  భారత స్వాతంత్రము నేతాజీ యొక్క చలువ కూడా అవుతుంది .  ఈ రాజకీయ పరిణామాలను గమనిస్తూ వచ్చిన ఆనాటి భారత ప్రజలు-- స్వతంత్ర సాధనలో గాంధీ నెహ్రు   లకు ఎంతటి పాత్రవుందో - నేతాజీ పాత్ర కూడా అంతే ఉందని భావించారు . అందువల్లే ముగ్గురికీ సమ స్థాయిలో గ్రామ గ్రామానా విగ్రహాలు వెలిశాయి .

ఇప్పుడు మనము చెప్పుకుంటున్న అసలు విషయము  వైపుకు వద్దాము .

సెప్టెంబర్  13, 1945 న  వియాత్నం లో తిరిగి పాలన ప్రారంభించిన ఫ్రాన్స్ 1949 నాటికి కోచించినకి ఇంకొన్ని వియాత్నం ప్రాంతాలను కలిపి  అసోసియేటెడ్  స్టేట్ అఫ్  వియత్నాం అనే దేశాన్ని ఏర్పరిచింది . తనకు రాజ్యము వద్దు - దాని బాధ్యతలూ వద్దు అని ప్రకటించి - జపాన్ వారినుండి స్వాతంత్రము తీసుకోవటానికి నిరాకరించిన రాజు Bao Dai, ఈ దేశానికీ నామ మాత్రపు రాజుగా పదవి స్వీకరించాడు .1953  లో  లాఓస్  మరియూ  కంబోడియా లు తమకు స్వతంత్రం ప్రకటించుకున్నాయి . ఇప్పుడు ఏ స్వతంత్రమూ లేని దేశంగా వియాత్నం మిగిలింది . ఇది వారికి తలఓంపులుగా మారింది .

ఫ్రాన్స్ **--వియాత్నం యుద్ధము [8]  12 -11 -24**

ఫ్రాన్స్- -తిరిగి వియాత్నం లో రాజ్య స్థాపనకు పూనుకోవటం తో ఆ దేశంలో ఆందోళన చెలరేగి - అది  ఫస్ట్ ఇండో చైనా వార్ గా మారింది . డిసెంబర్ 1946 లో మొదలైన ఈ యుద్ధము  ఫ్రెంచ్ సైనయానికి మరియూ  వియాత్నం లోని Ho Chi Minh మరియూ ఇతర కమ్యూనిస్ట్ లీడర్స్ నడుపుతూ వున్న  గెరిల్లా సైన్యానికి మధ్య జరిగింది . రష్యా / చైనా మద్దతుతో వియాత్నం ఓ కమ్మూనిస్టు దేశంగా మారవచ్చు నాని భయ పడిన అమెరికా - ఫ్రాన్స్ కి నేరుగా అండగా నిలిచింది . 1954: లో Dien Bien Phu, అనే పట్టణములో జరిగిన సంఘటన ద్వారా ఫ్రెంచ్ వారు వియాత్నం మీద తమ పాలనకు స్వస్తి చెప్పవలసి వచ్చింది.

Dien Bien ఫూ పట్టణము ఒక కోటలోని భాగము . చుట్టూ కొండలూ రాతి నేల. ఫ్రెంచ్ వారి దృష్టిలో ఈ కోట శత్రు దుర్భేద్యము యుద్ధానికి చాలా అనుకూలము . అందువల్ల ఫ్రెంచ్ వారు ఈ కోటాలో  40000 మంది సైనికులను సమకూర్చి పెట్టుకున్నారు . కోటలోనే ఓ విమానపు రన్వే కూడా నిర్మించుకున్నారు . ఈ కోట ఆధారంగా ఫ్రెంచ్ వారు ఇలా ఆలోచన

చేశారు .



Vietnam gorillas



female gorilla soldier

{1) కోటలో ఉన్న 40000 మంది ఫ్రెంచ్ సైనికులను నిలువరించాలని - వియాత్నాం అంతటా  విస్తరించి ఉన్న  గొరిల్లాలు అందరూ ఒక చోటకి జమ

అవుతారు - వియాత్నం గెరిల్లాలు మొత్తము ఒకటే చోట జమ అయితే తాము వారిని ఎదుర్కొన గలుగుతామా లేదా అనే విషయం మీద ఫ్రాన్స్ అతి ధీమాకి పోయింది .గెరిల్లాలు అంటే ఓ సైన్యము కాదని , వారు ప్రజలు అని ఫ్రాన్స్ అనుకోలేదు . {2}.వియాత్నం గొరిల్లాలతో యుద్ధము చేసే టపుడు ఫ్రెంచ్ సైన్యానికి కావాల్సిన ఆహారము- మందుగుండు సామాగ్రి - వైద్య సామగ్రి - వంటివి అన్నీ విమానాల ద్వారా నే కోటలోకి తెస్తారు - నేల మార్గము వాడరు {3} Dien Bien Phu, కోట లో జమ కూడి ఉన్న ఫ్రెంచ్ సైన్యాన్ని చూసి- ఒకే దెబ్బతో 40000 మంది శత్రు సైనికులను ముట్టు పెట్టి స్వాతంత్రము సాధించుకోవచ్చు అన్న కొండలలో నుండి గొరిల్లా సైన్యము బయటికి నడుచుకుంటూ వస్తారు . [4] అట్లా కొండల్లో నుండి బయటికి వచ్చిన వారి మీద బాంబులు వేసి వారందరినీ కే సారి చంపటం - దీని కోసం అని కోటలో వున్న ఫ్రెంచ్ సైనికులు విమానాలు ఎక్కి గెరిల్లాల తల పై బాంబులు వేస్తారు అంటే యుద్ధములో- ఎక్కడాకూడా ఫెంచ్ సైన్యము నేల మార్గము ద్వారా ప్రయాణించదు

{5} ఓ గ్రద్ద తన టార్గెట్ ను ఎన్నుకుని - దాన్ని వేటాడి మళ్ళా వెనక్కి వచ్చి గూటిలో విశ్రమించినట్లు గా ఫ్రెంచీ సైన్యము-- యుద్ధము చేస్తుంది . కొండల మధ్య తిరిగే కోడిపిల్ల మాదిరిగా గొరిల్లా సైన్యము ఉంటుంది {అని ఫ్రెంచ్ వారు అను కున్నారు }. ---- ---- నా ఆలోచన -- దీన్ని గరుడ వ్యూహము అనవచ్చు . మనకు పద్మ వ్యూహము అని వుంది . అది ఒక తామర పద్మము ఆకారంలో ఉందని సినిమాల్లో చూపుతారు .లక్ష్మీ దేవి పద్మ స్థిత అని చెపుతూ ఆమె తామర పద్మములో కూచుండినట్లు చూపుతారు . అందువల్ల పద్మము అనగా తామర పద్మమే అవుతుంది. పద్మ వ్యూహము అనేది పద్మపు ఆకారం లో వుండే వ్యూహం కాదని నేను అనుకుంటాను .---- మండే ఎండలో వుండే తామర పూవును రక్షిస్తూ వున్నది ఏమిటి ? దానికి నిరంతరం అడుగునుండీ అందే చల్లని చెరువు నీరు మరియూ నేలలోని పోషకాలు ఏ కదా ? . అందువల్ల కమల పద్మం ఎంత త్రీవ్ర,అయోమ ఎండకైనా తట్టుకొని జీవించి ఉంటుంది . ఇదే విధంగా పద్మ వ్యూహంలో ఉన్న ప్రతిఒక్క సైనికుడి కీ ఒక రహస్య విధానం ద్వారా నిరంతరమూ

బలమైన ఆహారము - మద్యము - మంచి నీరు- పదును పెట్టబడిన ఆయుధాలు అందుతూ ఉంటాయి . ఒక పద్ధతి ప్రకారము ప్రతి సైనికునికీ కొంత - విశ్రాంతి పీరియడ్ కూడా ఉంటుంది . ఈ వ్యూహము లేని యుద్ధములో కూడా ఈ రకపు సరఫరాలు ఉంటాయి కానీ అవి నిరంత రాయంగా ఉండవు .యుద్ధ పరిస్థితులను పట్టి సరఫరాలు ఆగి పోతాయి లేదా ఆలస్యము అవుతాయి . అప్పుడు సైనికులు క్రమంగా సెక్తి కోల్పోయి - మరో సారి ఆహారము - పానీయము - పదునైన ఆయుధాలు అందే దాకా డీలా పడివుంటారు . వారి యుద్ధ సామర్ధ్యము సగానికి పైన క్షీణిస్తుంది .వీరిని గెలవటం సులభం . -----పద్మ వ్యూహంలో నిరంతర సరఫరా వ్యవస్థఉంటుంది. దీనిని తామర తూడుతో పోల్చవచ్చు . పద్మ వ్యూహము ఛేదించటం అంటే తామర తూడు వంటి సప్లై వ్యవస్థను చెల్లా చెదరు చేయటమే . అభిమన్యుడు పద్మవ్యూహము లోని సప్లై వ్యవస్థ ఎక్కడ ఉంటుందో అన్నంత వరకు మాత్రమే తెలుసుకో గలిగాడు కానీ - తాను భగ్నం చేసిన సప్లై వ్యవస్థ తిరిగి పని చేయకుండా చూడటం ఎలాగో తెలుసుకో లేక పోయాడు అని మనం అనుకోవచ్చు. --------

{6}మొత్తము మీదా ఫ్రెంఛ్ సైన్యము ఇప్పుడు నేల మీద ఏ యుద్ధము చేయదు -- అంతా ఆకాశం ద్వారానే చేస్తుంది అనే వ్యూహం పన్నుకొని ఫ్రాన్స్ కూచుంది .

[7]ఫ్రెంచ్ సైన్యము తమపై ఏదైనా విమాన దాడులకు దిగితే తాము ఏమి చేయాలన్నది కూడా గెరిల్లాలు అలోచించి పెట్టుకుని అందుకు తగ్గట్లు వ్యూహము పన్నే ఉండవచ్చు గదా ? అని ఫ్రాన్స్ ఊహించలేక పోయింది . శత్రువు అంత సమర్ధుడు కాదు అని ఫ్రాన్స్ అనుకుంది .

[8] Dien Bien ఫూ అనే ప్రాంతము కొండలు గుట్టలు ఎక్కువగా వున్న రాతి నేల ప్రాంతము .ఈ ప్రాంతము యొక్క భూభాగ లక్షణాలు - యుద్ధము మీద ఇలాంటి భూభాగాలు చూపే ప్రభావాన్ని సరిగా అంచనాలు వేయలేని ఫ్రెంచ్ వారు - తమ యుద్ధ వ్యూహాలకు ఈ పట్టణాన్ని కేంద్రం గా ఎంచుకొని దెబ్బతిన్నారు . తమ కోట చుట్టూ వున్న కొండలు ఎక్కి యత్నాం గెరిల్లాలు ఏవన్నా రాకెట్

బాంబులు ప్రయోగించగలరని ఫ్రెంచ్ వారి ఊహకు అనిపించలేదు .శత్రువు అంత సమర్థుడు కాదు అని ఫ్రాన్స్ అనుకుంది.

కానీ వియాత్నాం గెరిల్లా నాయకులకు - ఫ్రెంచ్ వారిని లొంగ దీయటానికి కావాల్సిన ఆయుధాలు- బుల్లెట్లు - రాకెట్ బాంబు లాంచర్లు, విమాన విధ్వంసక రాకెట్లు వంటివి చాలా వున్నాయి . అవి వారికి చైనా/ రష్యా నుండి అందాయి. ఇలాంటిది జరుగవచ్చని ఊహించిన ఫ్రెంచ్ వారు వియాత్నాం గొరిల్లాలకు ఎటువంటి ఆయుధాలు అందకుండా అన్ని రహదారులు నిర్బదించి ఉంచారు . దీనితో సరిహద్దు ల వెంట నివాసం వుండే సాధారణ ప్రజలు - యుద్ధానికి కావాల్సిన సమస్త సామాగ్రిని చైనా / రష్యా నుండి అందుకొని - ఆపై వందలాది కిలోమీటర్ల దూరం కొండ మార్గాల ద్వారా ప్రయాణిస్తూ ఆ ఆయుధాలను గొరిల్లాలకు అందచేశారు . దీనితో సామాన్య ప్రజలు తమ దేశపు గెరిల్లాలకి విమాన విధ్వంసక రాకెట్లు , బాంబులు వంటి వాటిని సరఫరా చేసి నట్లు ఐయ్యింది - ప్రజలు అవసరాన్ని బట్టి -యుద్ధ సామాగ్రిని సైకిల్ మీదా -లేదా కూరగాయల బుట్ట ను నెత్తిన మోస్తున్నట్లుగా లేదా చేతి సంచుల్లో పట్టుకొని వందలాది కిలో మీటర్లు పర్వత / నదీ/ కాలవ మార్గాలకుండా రవాణా చేశారు .ఎంతో తర్ఫీదు పొందిన సైనికులే బాంబును మోయటానికి ఎన్నో జాగర్తలు తీసుకుంటారు - కారణం ప్రాణ భయం .

అలాంటపుడు "ఏ తర్ఫీదు పొందని ప్రజలు తాము మోస్తూ వున్న బాంబు వున్నట్లుండి పేలితే ఎలా ? అనే ప్రాణ భయం విడిచి ఆయుధాల సరఫరాకు పూనుకుంటారని ఫ్రెంచ్ వారు ఊహించలేక పోయారు. దీనికి కారణం వియాత్నాం ప్రజలలో స్వతంత్ర కాంక్ష ఎంత వున్నదో అంచనా వేయటం లో ఫ్రాన్స్ విఫలం అవటమే .సామాన్య ప్రజలు తిరుగు బాటు దారులకు సంపూర్ణంగా సహకరించారు. ఇదే ఫ్రెంచ్ వారి ఓటమికి కారణమైంది .

పై సంగతులు ఏవీ గమనించలేని ఫ్రెంచ్ వారు గొరిల్లా వద్ద తగినంత ఆయుధ సంపత్తి లేదన్న భ్రమలో పడ్డారు . ఫ్రెంచ్ వారు అనుకున్నట్లుగానే వియాత్నాం

గొరిల్లా లు అందరూ ఒక్కటి గా పోగై - పట్టణపు చుట్టూ వున్న కొండలలో దాగి ఉండి - ఫ్రెంచ్ సైన్యము మీదకు రాకెట్ బాంబులు వేశారు . గాలి లోకి లేచిన యుద్ధ విమానాలను తమ వద్ద వున్న విమాన విధ్వంసక రాకెట్లతో కూల్చి వేశారు .మొత్తము యుద్ధము గాలి ద్వారానే చేయాలనే వ్యూహము పన్నిన ఫ్రెంచ్ సైన్యము ఎటూ కదల లేక చతికల పడింది . చుట్టూ వున్న కొండలు ఫ్రెంచ్ వారిని కాపాడటానికి బదులు చంపటానికి నిర్ణయించుకున్నవి అనుకుందాము .

వియాత్నాం గొరిల్లాలు మొదటిగా గొరిల్లా పోరాట పద్ధతులను -- ఆ తదుపరి తమ దేశపు పురాతన కాలపు యుద్ధ వ్యూహాలను ప్రయోగించి - ఫ్రెంచి వారిలో తమకు ఓటమి తప్పదు అన్న నిశ్చిత భావన కలిగించగలిగారు .

వియాత్నాం వారికి ఎక్కువ ఆయుధాలు రష్యా నుండి అందేవి . ఫ్రెంచ్ వారు తమ స్వంత తయారీ ఆయుధాలు వాడుకున్నారు . దీనిలో MAT-49, అనే సబ్ మెషిన్ గన్ ముఖ్య మైనది . ఈ ఆయుధాలను వియాత్నాం గొరిల్లా లు చేజిక్కించుకుని వాటి తోటే ఫ్రెంచ్ వారిమీదే తిరగపడ్డారు . MAT-49 కి వ్యతిరేకం గా, రష్యా వారి AK-47 ఎదురు నిలిచిందేమో అనిపిస్తుంది -గానీ అలాంటిది ఏమీ లేదు ఎందుకంటే AK-47 ని రష్యా వారు 1967 లో రూపొందించారు .

ఫ్రెంచ్ సైన్యానికి ఆహారము ఆయుధాలు మోసుకు వస్తున్న విమానాలు అమెరికా తయారీవి . రష్యా నుండి తమకు అందిన RPG-2 మరియూ RPG-త్రీ- అనే విమాన విధ్వంసక రాకెట్లను వాడి న వియాత్నాం గొరిల్లాలు ఆ విమానాలను కూల్చి వేశారు . ఈ ఆయుధాలు గొరిల్లా కు చేరి వుంటాయని ఫ్రాన్స్ కలలో కూడా అనుకోలేదు .

విమానం ద్వారా సప్లై లు సరిగా అందుకోలేని ఫ్రెంచ్ సైనికులపై - వియాత్నాం గొరిల్లాలు - కోటకన్నా ఎక్కువ ఎత్తులో ఉన్న కొండ శిఖరాల మీద స్థావరాలు ఏర్పరుచుకొని - కోటను ముట్టడి లోకి తీసుకున్నారు . ఈ ముట్టడి , 56 రోజుల పాటు కొనసాగి ఫ్రెంచ్ సైన్యము ఎటూ కదల లేక - అన్నపానీయాల కోసం ఏడ్చింది . మొదటిగా కోటను రక్షిస్తూ ఉన్న సైనిక బలగాలు May 7, 1954 న -

ఇహ తమ వల్ల కాదు అని చేతులు ఎత్తేసాయి . వియాత్నం గొరిల్లా ల వలన ఫ్రాన్స్ సైనికులు 20,700 మంది మరణించగా 22,000 మంది గాయపడ్డారు . దీనితో ఫ్రాన్స్ July 21, 1954 న ఓ జానీవా ఒప్పందం ద్వారా యుద్ధ విరమణ ప్రకటించింది . వియాత్నం తరఫున ఈ మొత్తము ముట్టడి కి నాయకత్వం వహించిన దానిని సమర్ధ వంతంగా నడిపిన వాడు Ho Chi Minh .

ఇక్కడ ఫ్రెంచ్ వారు తాము ఓడి పోయామని ఒప్పుకొని వెనక్కు వెళ్లి పోలేదు . జెనీవా ఒప్పందం ద్వారా తమ మర్యాదకు లోటు రాకుండా యుద్ధ విరమణకు పూనుకున్నారు




French Prisoners of War Leaving Dien Bien Phu



Viatnam gorillas in a victorious march .

ఫ్రాన్స్ vs వియత్నామ్ యుద్ధము [9] 20-11 -24
ఫ్రెంచ్ వారికి మరియూ వియత్నామ్ వారికి జరుగుతున్న ఫ్రెంచ్ ఇండో చైనా యుద్ధము అని పేరు గల యుద్ధము ముగిసి పోయింది .గెలుపు ఓటముల ఆధారంగా కూడా యుద్ధము ముగియలేదు . ఓ పెద్దమనిషి/ లేదా ఓ మధ్యవర్తి కారణంగా నూ యుద్ధము ముగియలేదు. . యుద్ధములో ఓడిన ఫ్రెంచ్ వాబు తమంతట తాముగా "జెనీవా ఒప్పందాలు" అనే ఒప్పందానికి దిగి -- తమ ఓటమికి వేరే రంగు ఇచ్చుకున్నారు . అనగా తమ ఓటమిని ఓ ఒప్పందం కిందకు మార్చి , తమ పరువు దక్కించుకునే ప్రయత్నం చేశారు .
ఏది ఏమైనా ఫ్రెంచ్ వారు కింది గుణ పాఠాలు నేర్చుకున్నారు.
01 .వియత్నామ్ ప్రజల శక్తిని అంచనా వేయటం లో తాము పొరపడ్డాము అని ఫ్రాన్స్ ఒప్పుకుంది .02 .వియత్నామ్ లోని కొండలు గుట్టల కుండా సాగి పోయే దారులను అదుపు చేయటం, సప్లై లు నిరోధించటం కోసం తన దెగ్గర

తగినంత  సామర్ధ్యము లేదని ఫ్రాన్స్ ఒప్పుకుంది . 03 . అమేరికా  తనతో పాటు కలిసి వియత్నాం మీద విమాన యుద్ధము చేయాలని ఫ్రాన్స్ కోరుకుంది . దీనికి అమెరికా కలిసి రాలేదు  .వియాత్నం మీద అమెరికాకు వేరే సొంత అభిప్రాయాలు - కోరికలూ ఉన్నాయని ఫ్రాన్స్ మొదటి సారిగా   తెలుసుకుంది .

చివరికి  ఫ్రాన్స్ ప్రైమ్  మినిస్టర్  పియరీ  మెండ్స్ {Pierre Mendès} కాల్పుల విరమణ కోసం యుద్ధము ముగింపు కోసము తంటాలు పడ్డాడు . ఫ్రాన్స్ , నార్త్  వియత్నాం , సౌత్  వియత్నాం , కంబోడియా , లాఓస్ , చైనా , యునైటెడ్  కింగ్డమ్ , యునైటెడ్  స్టేట్స్ , అండ్  సోవియెట్    యూనియన్ లు సభ్యులుగా కల కమిటీ లో July 21, 1954  జెనీవా ఒప్పందం కుదిరింది . ఒప్పదం గురించి అనేక సమావేశాలు, సమావేశాలలో అనేక ఉప ఒప్పందాలు జరిగాయి .

01 . చివరి ఒప్పందం ప్రకారం - ఫ్రాన్స్ ఇండో చైనా అని పిలవబడే  లాఓస్ , కంబోడియా , మరియూ  వియత్నమ్ లలో తన యుద్ధాలను ఆపి వేస్తుంది . 02 . వియత్నామ్ ను రెండు గ్రూప్ లుగా / ప్రాంతాలుగా విడ దీస్తారు . రెండు ప్రాంతాల మధ్య ఎవరూ ప్రవేశించ కూడని ఖాళీ భూభాగము ఉంచబడుతుంది .03 . ఫ్రెంచ్ సైన్యము  సౌత్  వియత్నామ్  నుండి వైతొలుగు తుంది . 04 . నార్త్ వియత్నామ్ లో ఉంటూ - కమ్యూనిస్టులనుండి సాయం పొందుతూ ఉన్న వియత్నామ్ గొరిల్లా సేనలు కూడా అక్కడనుండి వైతొలుగు తాయి . ఇద్దరి మధ్యా ఖాళీ భూభాగమే సరిహద్దు . 05 . సౌత్  అసియా ప్రాంతము అని పిలవబడే ఏ దేశములోకీ  ఏ దేశపు మిలిటరీ వారు కూడా ప్రవేశించ రాదు . 06 . ఫ్రెంచ్ వారు వెళ్లి పోయిన రెండు సంవత్సరముల లోపు సౌత్ మరియూ నార్త్ వియత్నామ్ లో ప్రజాస్వామిక ఎన్నికలు జరిపి  ఈ రెండు వియత్నామ్ ముక్కలను తిరిగి ఒక్కదేశంగా  చేస్తారు . 07 . కెనడా , పోలాండ్ , అండ్ ఇండియా  సభ్య దేశాలుగా కల ఇంటర్నేషనల్  కంట్రోల్  కమిషన్  (ICC) జెనీవా  ఈ ఒప్పందం అమలు అయ్యే విధంగా పర్యవేక్షిస్తాయి .

యునైటెడ్ స్టేట్స్ మరియూ సౌత్ వియత్నాం ఈ జెనీవా ఒప్పందాన్ని అంగీకరించ లేదు .----సౌత్ వియాత్నం సంతకం చేయక పోవటానికి గల కారణాలు ఏమిటంటే ? ఈ ఒప్పందం కాలం నాటికి వియాత్నం సౌత్ లో కూడా కమ్యూనిస్టులు వున్నారు ,{వీరి పేరు నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ } ఇదే సౌత్ యాత్నం లో వియాత్నం కాంగ్రెస్ {వీరి పేరు వీట్ కాంగ్ or "VC }. అనే సంస్థ వారు కూడా వున్నారు . ఈ రెండు సంస్థల మధ్య గొరిల్లా పోరాటాలు జరుగుతూ ఉండేవి . నార్త్ వియాత్నం లో ఉన్న కమ్మ్యూనిస్టు పార్టీ-- సౌత్ లో వుండే కమ్యూనిస్ట్ పార్టీ వారికి సాయం చేయటానికి అని తన గొరిల్లాలను పంపుతూ ఉండేది . సౌత్ వియాత్నం లో-- కమ్యూనిస్టేతర ప్రభుత్వము- {ఫ్రెంచ్ మరియూ అమెరికా వారి చేతిలోని కీలుబొమ్మ వంటి ప్రభుత్వము} పాలన నిర్వహిస్తూ ఉండేది . ఆ ప్రభుత్వము ఈ ఒప్పందం పై సంతకాలు చేయటానికి వ్యతిరేకించి అమెరికా చూపిన దారిలో నడిచింది . ఇహ 1954 జానీవా ఒప్పందం ప్రకారం . అంతకు మునుపు ఒకే వియత్నామ్ గా వున్న భూ భాగంలో ఇప్పుడు రెండు దేశాలు గా విడదీయబడింది . ఒకటి Democratic Republic of Vietnam, లేదా North Vietnam, రెండు the Republic of Vietnam, లేదా South Vietnam .

నార్త్ వీయత్నాం ప్రాంతము - "హనోయి" అనే పట్టణం రాజ ధానిగా - Ho Chi Minh పాలన కిందకు అంద చేయబడుతుంది. Ho Chi Minh అంటే వియత్నామ్ నార్త్ ప్రాంతము పై పట్టు గల కమ్మ్యూనిస్టుల నాయకుడు .



Ho Chi Minh with public

ఇక వియత్నామ్ సౌత్ ప్రాంతము Ngo Dinh Diem అనే అయన పాలన కిందకు అంద చేయపడుతుంది . Ngo Dinh Diem అనే అయన వియత్నమ్ నార్త్ ప్రాంతములో పుట్టిన వాడు . కానీ తనపై బ్రిటిష్ వారి ప్రభావము అధికంగా వున్న రాజకీయ నాయకుడు . యాంటీ కమ్యూనిస్ట్ దేశాలు ఐన అమెరికాకు నచ్చిన వాడు . సౌత్ ప్రాంతాన్ని ఏలుతున్న Bao Dai అనే రాజుగారు ఈయనను ఒకప్పుడు తన ముఖ్యమంత్రిగా కూడా చేసుకున్నాడు . తనకు అమెరికా నుండి సులభంగా నిధులు తెప్పించి పెడతాడు అని .ఈ Ngo Dinh Diem అమెరికాకు అంతగా ఆప్త మిత్రుడు . ఇహ వియాత్నం పై జరిగిన జానీవా ఒప్పందం 1954 పై సంతకాలు చేయక పోవటానికి అమెరికా కు ఉన్న కారణాలు ఇవి . ఒప్పందం ప్రకారం ఎలెక్షన్స్ అనేవి జరిగితే వియత్నామ్ లోని రొండు ప్రాంతాలలోనూ రష్యా మద్దతు ఉన్న వియత్నామ్ కమ్యూనిస్టు రాజకీయ పార్టీలే గెలుస్తాయి అని అమెరికా గూఢచారుల నివేదిక . - కమ్యూనిస్టులు ప్రజాస్వామిక ఎన్నికలలో

గెలవటము అనేది అమెరికాకు ఇష్టం లేక పోయింది . తన అదుపులో వుండే యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ కింద కాక ఇంటర్నేషనల్ కంట్రోల్ కమిషన్ (ICC) అజమాయిషీ కింద ఎలెక్షన్స్ జరిగితే అవిప్రజా స్వామ్య ఎన్నికలు కాబోవు అని అమెరికా వాదించింది . ప్రస్తుతం వియత్నామ్ ను విడదీసిన ఫద్ధతిని చూస్తూ ఉంటే - వియత్నాం నార్త్ భూ భాగం లో కమ్యూనిస్టులు మరింత గా నిలతొక్కుకుంటారు .అనగా నార్త్ వియత్నామ్ ను చిన్న భూభాగానికి పరిమితం చేసి సౌత్ వియత్నామ్ ను బాగా పెద్దదిగా చేసి ఉండాలి అని అమెరికా వాదన .

తాను సంతకాలు చేయని - ఈ ఒప్పందం తనను ఏమీ కట్టడి చేయలేదని అమెరికా సుస్పష్టముగా ప్రకటించింది .-----



.

Viatnam boy playing with a french firearm

ఫ్రాన్స్ vs వియత్నామ్ యుద్ధము [10 ] 21 -11 -24

రొండు దేశాలుగా విడదీయబడిన వియత్నామ్ లో 1956 లో జరగాల్సి ఉన్న "జనరల్ ఎలెక్షన్స్ " ఎన్నటికీ జరగలేదు . జెనీవా ఒప్పందం 1954 ప్రకారము వియాత్నం దేశము తాత్కాలికంగా మాత్రమే రొండు దేశాలకిందకు విడదీయబడింది. 1956 లో ప్రజాస్వామిక ఎలెక్షన్స్ నిరవహించి- ఓ ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పరిచి -- తిరిగి రొండు ముక్కలనూ ఒక్క దేశముగా చేయాలని ఒప్పందం లోని సారాంశం . ఇండియా కూడా ఓ మెంబెర్ దేశం గా వున్న " ఇంటర్ నేషనల్ కంట్రోల్ కమిటీ" అనేది ఈ ఎన్నికల లోని ఖచ్చితత్వాన్ని కాపాడాలని కూడా ఒప్పందం లో వుంది . కానీ యునైటెడ్ నేషన్స్ మాత్రమే ఈ ఎన్నికలను పర్యవేక్షించాలని యునైటెడ్ స్టేట్స్ మరియూ సౌత్ వియత్నాం పట్టు పట్టాయి . దీనికి సోవియట్ యూనియన్ మరియూ నార్త్ వియత్నాం వ్యతిరేకించాయి . అలాగా ఎన్నికలు వాయిదా పడుతూ వచ్చాయి .



Hochiminh with china leader

జరుగుతూ వచ్చిన అనేక పరిణామాల ప్రకారం చూసినపుడు - అమెరికా వారు ఫ్రెంచ్ వారితో కలిసి వియాత్నం వ్యవహారాలలో చాలా కాలంగానే తల దూరుస్తూ వున్నారు . 1950 లో అమెరికా తన మిలిటరీ వ్యూహ కర్తలను ఫ్రెంచ్ వారికి సాయంగా వియాత్నం కు పంపింది . ఆపై సౌత్ ఈస్ట్ దేశాలు

అనబడే కంబోడియా , ఇండోనేషియా , లాటస్ , మలేషియా , మయాన్మార్ , ఫిలిప్పీన్స్ , సింగపూర్ , థాయిలాండ్ , మరియూ వియత్నాం దేశాలలో ఎటువంటి ఆశాంతులు అల్లరులు రేగకుండా చూసుకోవటం తన భాద్యతగా భావించి న అమ్రికా తన మిలిటరీ వ్యూహకర్తలను ఇక్కడే ఉంచి వేసింది . సౌత్ వియాత్నం లో వున్నది అమెరికా అనుకూల ప్రభుత్వము కాబట్టి అమెరికా ఆ పని చేయగలిగింది .

ఆపై - కమ్యూనిజం మీద కన్నెర్రతో 24 ఫిబ్రవరి 1965 నుండీ అక్టోబర్ 1968 వరకూ - "ఆపరేషన్ రోలింగ్ థండర్ " అనే పేరున అమెరికా నార్త్ వియాత్నం మీద బాంబులు వేసింది . దీనిలో విమాన మరియూ నావికా దళాలు పాల్గొన్నాయి . అమెరికా తరఫున వచ్చిన యుద్ధ వ్యూహకర్తలు - తమ చెప్పు చేతలలో వున్న సౌత్ వియాత్నం పాలకులకు నైతిక స్తైర్యం కల్పించాలన్న కోరిక కొద్దీ , మరియూ కమ్యూనిస్ట్ దేశమైన నార్త్ వియత్నాం ను అణగ తొక్కాలన్న కోరిక కొద్దీ , "ఆపరేషన్ రోలింగ్ థండర్" అమలు జరిపి నార్త్ వియత్నామ్ పై బాంబులు వేశారు . నార్త్ వియాత్నంలో కమ్యూనిజం వేళ్ళూ నుకున్నది కాబట్టి- అది క్రమంగా విస్తరిల్లి పైన పేర్కొన బడిన సౌత్ ఈస్ట్ దేశాలకు కూడా విస్తరించి- ప్రపంచములో కమ్యూనిజం ఎక్కువై పోతుందన్న భయంతో నూ -- కమ్యూనిజం ను అదుపు చేయటమే లక్ష్యంగా నూ - అమెరికా . నార్త్ వియత్నామ్ పై బాంబులు వేసింది తప్ప వేరు కారణం లేదు .

ఇక అమెరికా వారి బాంబు దాడులకు గురిఅవుతున్న నార్త్ వియాత్నం కి Ho Chi Minh పాలకుడు - ఈయనకు మిలిటరీ గొరిల్లా పోరాటాలు నడపటం లో 30 ఏండ్ల అనుభవము వున్నది . ఇప్పటికి ఒక సారి ఫ్రెంచ్ వారి నడ్డి విచాడు . ఈయన సౌత్ వియాత్నం ను అమెరికా ప్రభావం నుండి విడిపించి "అఖండ వియత్నామ్" ను సృష్టించే ఆలోచనలో వున్నాడు . అంటే

వియత్నామ్   భూభాగము అంతా కమ్యూనిస్టులదే అని పించే పనిలో పడ్డాడు.  దీనికోసమని  -- Ho Chi Minh కాపిటలిస్టుల చేతులో వున్న సౌత్ వియాత్నం లో ఉన్న   కమ్యూనిస్టులకు  తన   సహాయ సహకారాలు అందించ సాగాడు . దీనికి సౌత్ వియత్నామ్ యొక్క జనపు మద్దతు కూడా లభించింది .అంటే సౌత్ వియాత్నం ప్రజలు - తాము కూడా నార్త్ వియాత్నం లాగానే కమ్యూనిస్టు దేశము అయి పోవాలని కోరుకున్నారు.  ఈ నేపథ్యం లో సౌత్ వియాత్నం లో వున్న తన మిలిటరీ స్థావరాలను - నార్త్ వియత్నామ్ దాడి  నుండి క్షించుకోవటానికి అంటూ ,  అమెరికా  నార్త్  వియత్నాం మీద దాడులకు దిగింది .   అప్పటినుండీ మొదలెట్టి 1973  వరకూ  యునైటెడ్ స్టేట్స్  నార్త్  యత్నామ్ తో యుద్ధము చేసింది . ఒక నొక సమయం లో అమెరికాకి చెందిన సైనికులు 543000 మంది సౌత్  యత్నాం లో  వున్నారు . చివరికి మార్చ్  29, 1973. న అమెరికా వియత్నామ్ నుండి వైతొలగింది .

అమెరికా నార్త్ వియత్నామ్ తోనే యుద్ధము చేసినప్పటికీ --   అది అమెరికా రష్యాల మధ్య పరోక్ష యుద్ధము అని చాల మంది నమ్ముతారు .  సౌత్ వియత్నామ్ తరఫున  అమెరికా  మరియూ నార్త్ వియత్నామ్ తరఫున సోవియెట్  యూనియన్ మరియూ  చైనా యుద్ధము చేసినట్లు అయ్యింది . ఈ యుద్ధాన్ని సెకండ్  ఇండోచైనా  వార్ అంటారు : ఈ యుద్ధము మూడో ప్రపంచ యుద్ధముగా మారుతుందని చాల మంది భయ పడ్డారు . అందులో 1970  ల నాటి మా సోషల్ మాష్టారు గారు ఒకడు . ఆయన అప్పుడు అట్లాగా ఎందుకు భయపడింది ? ఇప్పటికి నాకు అవగాహనా అయ్యింది . నిజంగానే మూడో ప్రపంచ యుద్ధము రాకుండానే ఆగిపోయింది . ఈ సెకండ్  ఇండోచైనా వార్ అనే ఈ యుద్ధము గురించి మరొక సారి తెలుసు కుందాము .

ఇంతటితో ఫ్రాన్స్ ఇండో చైనా వార్ లేదా ఫస్ట్ ఇండో చైనా వార్  పై నేను రాయదలుచుకున్న వ్యాసాలు సమాప్తము - ఈ మొత్తము ఫది వ్యాసాలు

కలిపి ఒక పిడిఎఫ్ డిజిటల్ పుస్తక రూపం లోకి మార్చాను . ఫ్రీ కాపీ కోసం కామెంట్ బాక్స్ లో మీ వాట్స్ అప్ నెంబర్ పెట్టటం ద్వారా  అడగండి .

రచన సేకరణ వివరణ వారాణసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

.   **my wife varanasi uma devi died on 11-09-2024.this was dedicated to her fond memory .**




Vietnam gorilla hiding in a corn field



**militia women parade during a ceremony held 07 May 2004 to mark the 50th anniversary of the Dien Bien Phu battle in the former battlefield of Dien Bien Phu**,




